Regd No. N. 45 / M. 3813

౨౫౮౭

వెల ఒక అణా



# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక



సంపుటము ౧౬ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౩ వృషసం॥ర ఆషాఢ శు॥ ౧౪ (౧-౧౦-౧౩౫౦ ఫ.) సోమవారము సంచిక ౧౯

# జర్మనీరష్యా యుద్ధము

## జర్మనుల విజృంభణ

జర్మనీవారు రష్యాకు ఉత్తరభాగంలోనుండే మర్మిాన్స్కు ఓడరేవునుపట్టుకున్నారు, ౧ జూలైనాడు మిన్స్కునగరానికి తూర్పుగా మాస్కో వైపు ౪౦ మైళ్ళదూరంలోజర్మనుసైన్యాలునడిచినవి, ఆదేరోజున కార్పేథియన్ పర్వతాలసమీపము లోనుండు రష్యన్‌సైన్యాన్ని ఓడించినారు, బాల్టికునుండి లెనిన్‌గ్రాడునగరానికి పోవురైలుమార్గమును నాలుగుచోట్లలో ధ్వంసంచేసినారు, ౫౩ రైల్వే గుడ్సుబండ్లను ఒకమందుసామానుగల రైలుబండిని జర్మనులు ధ్వంసంచేసినారు, ౧ జూలై నాడు మొట్టమొదటిసారి జర్మనులు మాస్కో నగరముపై బాంబులువేసినారు, జర్మనులయొక్క ఈ యూహకోటునావలు రష్యావారిచే ముంచబడినవి, ౨ జూలైనాడు జర్మనులు మిన్స్కునగరానికి తూర్పుననుండు నట్టిస్మోలెన్స్కు అనుస్థలమును సమీపించినారు ఇది మాస్కోనగరానికి ౨౫౦ మైళ్ల దూరములోనున్నది. దక్షిణంలో యుక్రేను ముఖ్యపట్టణమును జర్మనుసైన్యము సమీపించినది అచ్చట ఇంతవరకు ప్రథ్ అనునదిని జర్మనులను దాటనీయకుండా రష్యనులు చాలాప్రతిఘటించియుండిరి. ఇప్పుడు ప్రథ్‌నదిని జర్మనులు దాటినారు ఉత్తరములో ఫిన్లెండువారు అలెండు ద్వీపాలనుపట్టుకొన్నారు, తూర్పులో ఒకచోట చాలారష్యను సైన్యదళాలను జర్మనులు ధ్వంసంచేసినట్లు చెప్పుకొనుచున్నారు రష్యాలోస్త్రీలు గొప్పకార్యసాహసాలతో సిపాయిలవలె యుద్ధములో పనిచేయుచు చాలకోటలనురక్షించుచున్నారు

### స్టాలిన్ రేడియో ప్రసంగము.

అన్నిటికన్న ముఖ్యవార్త రేమనగా రష్యానియంతయగు స్టాలిన్ గురువారంనాడు రష్యాజనులకు రేడియోద్వారా యీవిధముగా ఉపన్యసించినారు.

"రష్యాసైన్యము గొప్పశౌర్యమును ప్రకటించిశత్రువులను ప్రతిఘటించినది, శత్రువులయొక్క యుత్తమసైన్యదళాలు చాలనాశనము చేయబడినవి, అట్లయినను శత్రువులు ముందుకుసాగుచునేయున్నారు. కానితుదిలో హిట్లరుసైన్యమునుమనముతప్పక ఓడింపగలము, హిట్లరుసైన్యములిథువేనియను లాట్వియాలోవిశేషభాగము తెల్లరష్యాలోని పశ్చిమభాగము, యుక్రేనులోని పశ్చిమభాగమునున్ను ఆక్రమించుకొనియున్నది, శత్రువుల విమానాలు మార్మాన్స్కు స్మోలెన్స్కు, కీవు, ఒడెస్సా, సెబాస్టపూలు నగరాలపై బాంబులువేయుచున్నవి. మనదేశానికి గొప్పప్రమాదస్థితి యేర్పడియున్నది మన సైన్యము జర్మనుసైన్యాలకు చాలాపట్టణాలలో లోబడిపోయినది అయినా ప్రపంచములో యేసైన్యమున్నూడా అజేయముగా ఉండజాలదు పూర్వము నెపోలియను సైన్యము అంతములో ఓడిపోయెను గతయుద్ధములోగూడ జర్మనులు ఓడిపోయియుండిరి ఆదేగతి హిట్లరు సైన్యమునకున్ను పట్టగలదు జర్మనులు మనదేశములో కొన్నిప్రాంతాల నాక్రమించుకొనుటకు వారకస్మాత్తుగా మనదేశముపైనపడుట రేకారణము జర్మనులకు నీతినియమములు లేకపోయెను అయితే బద్మాషులను,రాక్షసులును అయినహిట్లరుతోను రిబ్బెంట్రాపుతోను మనసోవియేటు ప్రభుత్వము యెందుకు సంధిచేసుకొని యుండెనని ప్రశ్నించవచ్చును ౧౯౩౯ లో ఉభయదేశాలకు సంధి జరిగినపుడు పరస్పరంగా శాంతినెలకొల్పేదానికి సంధిచేసుకొనబడెను హిట్లరు రిబ్బెను ట్రాపువంటి భూతాలు వంచకులు పరిపాలించునట్టి రాజ్యము తోనయినను వారు శాంతికోరినపుడు దానినంగీకరించుట ధర్మమని తలంచితిమి పైగా యీనాలుగుమాసములు మనదేశానికి శాంతిలభించెను, జర్మనీ దండెత్తివచ్చేపక్షంలో మన సైన్యాన్ని బాగా సిద్ధముచేసుకొను నవకాశము లభించెను, సంధిపత్రాన్ని చించివేసినందున జర్మనీకికలిగినలాభమేమి? కొద్దికాలమనుభవించుదానికి కొంతలాభంకలిగినది కాని సర్వప్రపంచదృష్టిలో రక్తపిపాసియయినదేశమని నిరూపించుకొన్నది, తుదకు జర్మనీలోని యుత్తమ స్వభావులుగూడా మాదే న్యాయమార్గమని చెప్పగలరు,

శత్రువునకు అపారమయినటాంకులు విమానాలసహాయమున్ను ఉన్నది, వేలకొలదిటాంకులతోను విమానాలతోను మనయొక్క మహాబలమును శత్రువును ప్రతిఘటించబోవుచున్నది, రష్యాప్రజలు శత్రువునునాశనంచేయుటకే క్రిందివిధానాలుఅవలంబించవలెను: మొట్టమొదటమనదేశం అపాయస్థితిలోనున్నదన గమనించవలెను, జనులునిష్పృహతో ఉండకూడదు, మనశత్రువుడు క్రూరుడును కరుణారహితుడునయినవాడు, వాడుమనదేశాన్ని మనపంటలను మననూనెనుతీసుకొని సైన్యభూస్వాములను నెలకొల్ప మనజాతీయ సంస్కృతిని స్వాతంత్ర్యమును నాశముచేసి జర్మను సంస్కృతివ్యాపింపజేసి జర్మనుప్రభువులకు జర్మను కోటీశ్వరులకు మనమందిని బానిసలనుగా చేయజూచుచున్నాడు. కావునదినిది మనచావుబ్రతుకులయుద్ధము మనము శత్రువుపై దయచూపరాదు, మనలో పిరికిపందలు,పనిదొంగలు, కాతరస్వభావులు నుండరాదు, ప్రతిరష్యనుయువకుడునుమనదేశంలోనిప్రతి అంగుళములోకూడా తుదిరక్తబిందువుండునంతవరకును యెదుర్కొనయుద్ధసామగ్రిని సిద్ధముచేయవలెను శత్రువులు మోసముం దారితీరినవారు, వారు లేనిపోని వదంతులను వ్యాపింపజేయుదురు ఎవరును మోసపోకూడదు దేశరక్షణలో ఆటంకములు కలిగించువారందరును వారెంతటి గొప్పవారయినను శిక్షింపబడుదురు రష్యాసైన్యము ఓడిపోయి వెనకకుమరలిరావలసివచ్చినచో రైల్వే సామానుల నన్నింటిని ఊడదీసుకొని రావలెను ఒకరైల్వే డబ్బాగాని ఒక నీరుగింజలుగాని, ఒక గ్యాలను పెట్రోలుగాని శత్రువులకు చిక్కనివ్వకూడదు రైతులు తమ పశువులనన్నింటిని తోలుకొని రావలెను తమ ధాన్యాన్నంతా ప్రభుత్వానికప్పగింపవలెను ఏదేవస్తువులను ప్రజలు వెంటతీసుకొని పోజాలరో వానినిధ్వంసము చేసిపోవలెను, శత్రువులాక్రమించుచున్న ప్రాంతాలలో కూటయుద్ధములను జనులుచేయుచుండవలెను వారధులను రోడ్లను, టెలిఫోనులను తంతులను ధ్వంసముచేసి పోవలెను, అడవులను కోతాలను, రైళ్లను తగులబెట్టవలెను, మొత్తముపై జయించిన ప్రాంతాలలో శత్రువులకు శాంతిలేకుండా చేయవలెను, మనము చేయు యుద్ధము కేవలముస్వదేశరక్షణకేగాదు హిట్లరుచే అణచివేయబడిన యూరోపుదేశాల స్వాతంత్ర్యమునకు కూడనై యున్నది,

### సిరియా రంగము

సిరియాలోని డమస్కసు నగరానికి తూర్పున ౧౫౦ మైళ్ళదూరములోనుండు పల్మయిరా అనునగరమును ఇంగ్లీషువారు వశపరుచుకొనిరి, ఫ్రెంచివారు తుర్కీమీదుగా సిరియానగరమునకు ఆయుధసామగ్రినిపంపుటకై తుర్కీవారిసెలవు కోరియుండిరనియు తుర్కీవారు అట్టికోరికను నిరాకరించిరనియు సిరియాలోనికి సైన్యసహాయాన్నికూడా తుర్కీ మీదుగాచేయుటకు తుర్కీవారంగీకరింపలేదని తెలియుచున్నది,

### అబిసీనియా రంగము

అబిసీనియాలోని డెబ్రాటాడంబేబర్ అనుప్రాంతములో యుద్ధముచేయుచున్న ఇటలీ సేనానాయకుడు తన 3 వేలసైన్యముతో ఇంగ్లీషువారికిలోబడిపోయెను, ఈ డెంబెరుఅనుస్థలము టానాసరస్సుకు తూర్పున ౪౦ మైళ్ళదూరములోనున్నది, ఇంచుమించు అబిసీనియాదేశమంతయు ఇటలీవారినుండి గెలుచుకొనబడినది, గొండారుఅను స్థలమున్ను దానిచుట్టునుండు కొంతప్రదేశముమాత్రమే ఇటలీవారికి మిగిలియున్నది, అచ్చటినుండికూడ ఇటలీవారిని పరాలంగాలేవనెత్తేప్రయత్నం జరుగుచున్నది,

### ఇంగ్లీషు విమానాల దాడి

ఫ్రాన్సుపై యింగ్లీషువిమానాలు ౧౧ జర్మను విమానాలనుధ్వంసముచేసినవి, ఇంగ్లీషువారివి ౬ విమానాలుపడిపోయినవి: ఫ్రాన్సుకు ఉత్తరభాగములో ౧౭ శత్రువిమానాలుపడగొట్టబడినవి. బ్రెమన్‌అనుజర్మనుఓడ రేవుపై యింగ్లీషు విమానాలుబాంబులువేసినవి: బ్రెమన్‌లోను చెర్బర్గులోను, రాటురుడామ్‌లోను జర్మనులు కూర్చిపెట్టిన నూనెటాంకులపై యింగ్లీషువిమానాలు టాంకులనుతీసి నాశముచేసినవి, ఫ్రాన్సుతీరములో శత్రునౌకయొకటి ముంచబడెను,

### జపాను వైఖరి

జపాను యింతవరకు రష్యాజర్మనీలమధ్య యేపక్షమునవలంబించునదియు నిర్ణయించుకొనలేదు, ఇంతలోజర్మనీవారు రష్యా వారిచే చీనాలో నాను కార్డు మేర్పాటుచేయబడిన వాంగుప్రభుత్వమును అంగీకరించయున్నారు- వారేకాకుండా స్పెయిను హంగెరిదేశాలుగూడా అంగీకరించినవి,

ఫ్రాన్సువారు గష్యావారితో సంబంధాలు విచ్ఛేదం చేసుకొన్నారు,

## సి. వై. చింతామణిగారు

కీ-శే- చిర్రావూరి యజ్ఞేశ్వర చింతామణిగారు ౧ జూలైనాడు చనిపోయిరి. వారుఆంధ్రులు. మొత్తం హిందూస్థానములో చాలాప్రసిద్ధినొందినట్టివారు- వారు ౧౧ ఏప్రెల్ ౧౮౮౦లో జన్మించినారు- విజయనగరం మహారాజా కాలేజిలో విద్యాభ్యాసంచేసినారు- అలహాబాదునగరంలో 'లీడర్' అను ఇంగ్లీషుదినపత్రికకు ౧౯౦౯లో సంపాదకులైనారు. యూ. పీ. అనగా ఆ యాగ్రా అవధ్ ప్రాంతాలశాసనసభలో ౧౯౧౬ నుండి ౧౯౨౩వరకు సభ్యులుగాఉండిరి. ౧౯౧౯ లిబరల్‌పార్టీఅనగా మితవాది సంఘముయొక్క ప్రతినిధిగా ఇంగ్లాండుకువెళ్ళియుండిరి. లిబరల్ ఫెడరేషనుయొక్క కార్యదర్శి ౧౯౧౮ నుండి ౧౯౨౦ వరకును ౧౯౨౩ నుండి ౧౯౨౯ వరకును పనిచేసిరి. లిబరల్ సంఘాధ్యక్షులుగా ౧౯౨౦ లో ౧౯౩౧లోను ఉండిరి. వీరిబ్రిటిషు ప్రభుత్వమువారు సర్ బిరుదమిచ్చిరి. యూపీ రాష్ట్రంలో ౧౯౨౦ నుండి ౧౯౨౩ వరకు విద్యామంత్రిగాపనిచేసిరి. ౧౯౩౦లో ఇండియన్ రౌండు టేబిల్ సభకు వెళ్ళినవారిలో వీరొకరు- హిందూ ముస్లిం శాసనసభ్యులసీట్లవిషయం ల్రిటిషువారు చేసియుండిరి- అంతమమస్లిములకు చాలాఎక్కువసీట్లుఇచ్చియుండిరి, దానిప్రతిఘటించుటకై చేసినసభకువీరధ్యక్షతవహించిరి. అలహాబాదు విద్యాపీఠమువారు వీరికి గౌరవ డాక్టర్ (ఎల్.ఎల్.డీ.) బిరుదమిచ్చిరి- అదేవిధంగా బెనారసు విద్యాపీఠంవారును వీరికిబిరుదమిచ్చిరి. వీరు మంచిరాజ్యాంగవేత్త. రాజ్యాంగసమస్యలనుగురించి వీరుకొన్ని గ్రంథాలనువ్రాసినారు- వీరు లీడరుపత్రికా సంపాదకులుగా చాలాప్రఖ్యాతి గాంచినారు.

## బాలికాసంఘము ఎన్నికలు

బాలికలఉన్నత పాఠశాల,
నారాయణగూడెము

హైదరాబాదు (దక్కన్). ౪-౭-౪౧
నేటిమధ్యాహ్నము 3-30 గంటలకు మా పాఠశాలభవనములో బాలికలసంఘము ప్రారంభోత్సవమును, కార్యనిర్వాహకవర్గముఎన్నికలును జరిగినవి క్రొత్తగా బాడ్‌మింటన్, వాలీబాల్, బాస్కెట్‌బాల్, ఈ మొదలుగాగల క్రీడాసాధనములు ప్రారంభింపబడినవి-

ఎన్నికలఫలితములు

౧- అధ్యక్షుడు శ్రీయుత కే- విశ్వనాథము గారు బి ఏ, హెడ్మాస్టరు
౨. ఉపాధ్యక్షుడు శ్రీయుత కనకరాజాగారుబిఏ
౧- కార్యదర్శిని శ్రీమతి అహల్యాదేవి ౫వ ఫారము
౨- సహాయకార్యదర్శిని అనిరాజ, అమ్మాజి ౬వ ఫారము
మరియు ౧౨ బాలికలు కార్యనిర్వాహకవర్గములో ఎనుకొనబడినారు-

### మహారాజాబహద్దరీ దినము

మహారాజా సర్ కిషన్‌ప్రసాదు బహద్దరు జ్ఞాపకార్థమై ౩-౭-౪౧నాడు హైదరాబాదు రేడియోపై రై, అ, సర్ అక్బర్ హైదరీగారిట్లు పన్యసించిరి.

మహారాజాబహద్దరుగారు పూర్వంలో ప్రధానమంత్రిగా ఉండినవారు. వారునాకు వితులుకూడా.

నేను ఈరాష్ట్రంలో ౧౯౦౫లో అకౌంటెంట జనరల్‌గా ఉద్యోగమున్ప్రారంభించితిని. అప్పుడుమహారాజాగారు ప్రధానమంత్రిగా మహారాష్ట్రంలోగా ఉండిరి. మళ్లీవారు౧౯౨౬లో ప్రధానామాత్యులైనప్పుడు నేను పైనాన్సుమంత్రిగావారితోకూడా ౧౧ఏండ్లుపనిచేసితిని

అకాలంలో వంతయువారిలో నాలుగు గొప్పగుణాలు నాకువ్యక్తమైనవి వారుఅచంచల గారాజభక్తిగలవారు. వారుఆర్యపురుషులు (జంటిల్మెన్) కలోపాసకులు సర్వమతాభిమానులు అందులోముఖ్యంగా ఇస్లాంమతంపైవారికిచాలా అభిమానముండింది. వీరుమొగలాయి కాలపు వారు, అట్టివారిప్పుడు మనసమాజాలలో కన్పించరు.

## భారత సేనాని మార్పు

హిందూస్థానములోని సేనలకు సేనాధిపతిగా ఇంతవరకు సర్ అచిన్‌లెక్ గారుండిరి. ఇప్పుడు వారిని మధ్యధరాసముద్రప్రాంతముల సేనానిగా మార్చివేసినారు. వారిస్థానములో హిందూస్థాన సర్వసేనానిగా జనరల్ వావెల్ గారు నియుక్తులైనారు. ఈ వావెల్ సేనానిగారు ఈజిప్టు, లిబియా, అబిసీనియారంగాలలో శత్రుసేనలపై చాలాగొప్పవిజయాలు పొందియుండిరి-వీరుఆంగ్లసేనతో గ్రీసులో జర్మనులతోయుద్ధాలుచేసినవారు, వీరిప్పుడు ఇండియాకువచ్చుటలో ఏమైనాఅంతరార్థముకలదేమోఅని కొందరుఊహించుచున్నారు- వావెల్ గారికి రష్యావిషయంతెలిసినంత మరొకసేనానికితెలియదందురు. జర్మనులు కాకేసియాపర్వతందాటి రష్యాను ఓడించి తూర్పునకు వచ్చినట్లయిన వీరు తమ అనుభవాన్నిబట్టి దానికి తగినప్రతిఘటన చేయగలరని యిట్టివీరినిక్కడికి పంపినారని కొందరుతలచుచున్నారు.

# గోండులు-వారి యావేదనం

(గతసంచిక తరువాయి)

జి. యస్. గుప్తాగారు

గోండులను గురించి యెవ్వరున్నూ శ్రద్ధతీసుకోరు. మనరాష్ట్రములో గోండులు, కోయలు, చెంచులు ముఖ్యమైన ఆటవికజాతులు. అందులోగోండులసంఖ్య యెక్కువగాకనబడుచున్నది. కొన్నిమాసాలక్రిందట గోండులపై పోలీసువారి తుపాకీకాల్పులు జరిగినసందర్భంలో వీరిఅస్తిత్వము రాష్ట్రానికేకాక ప్రపంచానికిన్ని విస్ఫుటమయ్యెను. గోండులు హిందువులేఅయినా మనసనాతనులుకాని ఆర్యసమాజమువారుకాని వారివిషయములో శ్రద్ధతీసుకొనుటలేదు. సనాతనులకు బాల్యవివాహంపైఉన్న అభిమానం మన ఆటవిక సోదరులపై కానరాదు. హిందువులకన్నను ఎక్కువగా క్రైస్తవులకే యీజాతులపై అభిమానమున్నది. కారణం? వారిని క్రైస్తవులనుగాచేయు అభిలాషయే! ఎల్విన్ అను యింగ్లీషుపండితుడు ఈజాతినిబాగా ప్రేమించేవారు. తుదకు ఈజాతిలోని ఒకయువతిని వారుపెండ్లాడినారు. అయితే వారికి మతపరివర్తనోద్దేశ మేమిన్నిలేదు. వారు గోండుల సుఖదుఃఖాలను బాగాయెరుగుదురు. వారి పాటలను సమకూర్చి ఇంగ్లీషులో భాషాపరివర్తనముచేసి ప్రకటించినారు. గోండులగురించి యెన్నియోవ్యాసాలువ్రాసినారు. ఒకతడవ ఇట్లువ్రాసినారు. "మధ్యహిందూస్థానమందలి ఆటవికఅమాయిక భావోపేతులైన జాతులలోకొందరు ప్రపంచజనులలోనెల్లను అత్యంత ప్రీతిపాత్రులైనవారు లభించుచున్నారు"

ఈగోండులు గోచిబట్టకు తప్ప మించినఉడుపులులేనివారు- నిరపాయులు. ప్రేమపాత్రులు. విశ్వాసయోగ్యులు, అమాయకులు. కష్టజీవులు. వీరి ఆచారవ్యవహారములనుగూర్చి శ్రద్ధతీసుకొన్న జి. యస్. గుప్తాగారు ప్రశంసార్హులు. మననాయకులు వీరివిషయమై ప్రత్యేకశ్రద్ధవహింతురుగాక.

గో. ప,

---

ఇంకను వీరిబాధలుమరీవిచిత్రముగానున్నవి. అందులోకొన్నిటిని ముఖ్యాంశములుఅయినందున గాను యీదిగువ బహిరంగపరచుచున్నాము.

౧. ఖానూనెశేరవామీజాన్వరాణ్ స్థానిక పోలీసుమున్నగువారలు దీనికిశేరేఅర్థముగైకొనుచు మల్లుకట్టులుండు పసులైనకట్టనుకూడా వాడకూడదని నిర్బంధించుచుండుటకలదు. దీనివలనప్రత్యేకముగా వ్యవసాయకులకు బహుఇబ్బందిజర్గుచున్నది.

౨. ఒకడు నిరుపేదరికమువలన అరకకు ఒకసైపుగొడ్డుఇవును మరియొకసైపుయెద్దునుకట్టి వ్యవసాయముచేసినట్లయిన జార్మానా విధింపబడుటయు.

3. ఖానూనెఖర్జదహందగాణ్:—వడ్డీపై అభారపడియున్నవారు అనగావడ్డినిజీవనోపాయముగాభావించివర్తించువారు ౧౨ రూపాయలనిచ్చి నాల్గుసంవత్సరములపేర లైసెన్సులుగైకొనవలయుననునిర్బంధమువలన ప్రజలపై వరీఒత్తిడిగావించుచున్నట్లును ౯౦ రూపాయలనిచ్చి వందపేర దస్తావేజు రాయించుకొనుటయు జరుగుచున్నట్లువినికిడి. యీలాంటిబాధలను ప్రజలు సంవత్సరముపొడవున భరించుచుండుటయు ఇంతేకాదు భత్తాదారులు, అరబ్బులు, సాహుకారులు, ఫకీరులు, గారడి, దొమ్మరీలును బాధించువారిలోచేరినవారని వేరేచెప్పనక్కరలేదు ఇకతుదిపద్ధతియగు హుక్రాజు (వేలము) వలన ౧౦రూకలవస్తువును ౨ రూకలదిగా లెక్కించుచుండుటయు యీవిషయములు పాఠకులకునూతనములుకావు. తరిమ్మరభముకై మళ్ళీమళ్ళీబాధించుచుండుటయు యీలాంటిబాధలకు తాళలేక పెక్కురు స్థలాంతర్గతులవుచుండుటయు జరుగుచువచ్చుచున్నది. యీజిల్లాలోని అధికసంఖ్యాకులగుప్రజలు బ్రిటిషిండియాకుచేరినట్టి బలార్షా, చాందా జిల్లాలలోని గ్రామాదులకువెళ్లిజీవనములగడుపుచున్నారు. ఈలాటిదగండ్లు ప్రత్యేకముగా గోండులనెగాక ఇతరప్రజలనుకూడా యెదిరించుచున్నట్లు యెన్నియో నిదర్శనములుకలవు. అప్పుడప్పుడు గావింపబడు మాఫీలన్నియు తరీపంటలకుసంబంధించినవగుటవలన ఖుష్కీపంటలుగల గోండులును యిచటిప్రజలును యేమాత్రములాభములబడయకుండనున్నారు.

## వెట్టి, వంతు, లంచము, విడిదికోళ్లు

పైవిషయములందు ప్రజలతోసహా గ్రామాధికారులును వతన్‌దారులును పీడింపబడువారేయని ఘోషించగలను- గ్రామాధికారులయొక్కయు వతన్‌దారులయొక్కయు నిరంకుశత్వమే కారణమనికొందరు నొక్కివక్కాణించుచున్నారు- ఇట్లుఅధికజోక్యముగైకొనువారిలో ఒకరు ప్రజలదృష్టికివచ్చుచున్నారు- వీరు వివిధసంబంధములందు స్థానిక ఉర్దూ పత్రికలగు పయామ్, రహ్బర్, వక్తులందు యెన్నియోవ్యాసములనువ్రాసియున్నారు. వీరు వమ్నూరులోసంస్థానోద్యోగిగానుండి దానికి రాజీనామాపెట్టియుండిరి తర్వాత ఆంధ్రజనసంఘము ఆసిఫాబాదు వర్కింగుకమిటీ సభ్యులలోనొకరుగానైకి చూచుటకు జాతీయవాదిగానుండి ముస్లిము పట్టేదారాణ్, ఇత్తెహాదుల్ ముస్లిమీన్ మరియు ముస్లింలీగుమున్నగుసంస్థలందు రహస్యాభిమానమును చూపించుచు తుదకుజిల్లాంధ్రసంఘము తగువాయకులులభించనందులకు లేచిపోయినరోజామొదలుకొని నేటివఱకు మతపాక్షికదృష్టిగల యీతను చేయుచున్న ప్రచారప్రబోధములు విభేదాలకుకారణమైనవి.

పాపము ప్రభుభక్తితోకూడినట్టి గ్రామాధికారులత్యాగధైర్యస్థైర్యము లెంతటిఅభినందనీయమైనను మన్నించువారేలేరైరి.

౧౨రూపాయల జీతము పొందుచుండెడి చౌకీదారులు ఈగోండులుండుఅడవులలో నియమితులైయున్నారు. వీరు ఒక్కొక్క చౌకీపేర ఇద్దరుముగ్గురను ఆరేసి రూపాయల జీతముపై నుంచుచుండుటయు వారిజీతములు భరించుచుండుటయు యీలాటిశక్తి వీరికెచటినుండి లభించుచున్నదో పాఠకులు గమనించదగిన విషయము. వి.కె.రెడ్డిగారు రచించినట్టి "దుఖీవతందార్" అనుఉర్దూపుస్తకమునందున వతన్‌దార్ మరియు గ్రామాధికారి యనుపుస్తకమువలనను గ్రామాధికారులును వతన్‌దారులునునిరంకుశులు కారనియెన్నియోనిదర్శనములుబహిరంగపరచబడినవి. తెలంగాణాలోని యితరప్రాంతములందలి గిర్దావరులెట్లు హడావడిగావించుచుందురో తద్విధముగనే యిచటికొందరి అటవీశాఖోద్యోగుల అత్యాచారాలు విరివిగాజరుగుచుండుట కలదు.

సర్బరాహి:—అప్పుడప్పుడు దౌరాపైవచ్చునట్టి అధికారులట్లుండ ప్రతిదినము చౌకీపైనుండునట్టి చౌకీదారులయొక్కయు, సెక్రేహదారులయొక్కయు వారిజవానులయొక్కయు సర్బరాహిచేయుచుచేయుచు శ్రీవ్యసరుదిపట్టుటయు జరుగుచుండును. కొన్నికొన్నిసందర్భములందు గ్రామములోదొరకని వస్తువులే కావలయునని బాధించుచుండుటయు ఇంకాయీలాటివిషయా లెన్నియోకలవు.

బండ్లవెట్టి:—అటవీశాఖకు సంబంధించినట్టి చౌకీదారులకును సెక్రేహదారులకును యెప్పుడూ బండ్లఅవసరముండుటయు బండ్లవారికొక పైసఅయినాఇయ్యకుండుటయు, సామానుతో నిండియున్నట్టిబండ్లనుకూడా సామానునుపారవైచి వెట్టిలోకిగొంపోవుటయు వారములవరకు తమ అక్కరలో నుంచుకొనుటయు జర్గుచువచ్చుచున్నది.

ఇచట నేటుసదీలకు ఇనాంభూములులేనేలేవు-అయినను అందరు వెట్టిలోకిగొంపోబడువారే, బాధింపబడువారే. మంచములు, అయితే నెలలు గడచినను తిరిగిరాకుండుటయు చొప్పు, పాలు,పెరుగు,నెయ్యి, కోళ్ళు,మేకల వెట్టికిపరిమితిలేదు. మందినిబండ్లనుముందుగా ఊరికించుటట్లుండ వంతుమరియు విడిదికోళ్ళపద్ధతి మరీ హాస్యాస్పదముగానున్నది. అంతేకాదుఆస్థిఅవినీతికొని తిరిగిఇవ్వకుండుటయు లేనిపోని నేరారోపణలగావించుచుండుటయు కచేరీలో వంటచెఱకు లకోరత్తు చిట్టీలాసగబడకుండుటయు శెత్తిమోపు లపారినుంచి నెలనేర యేర్పాటుచేసికొనుటయు పూర్వపురుషులూరా లైసెలు న్యాయసమ్మతముగానుండెను-కాని దాదాపు౧౦-౧౫సంవత్సరములాయెను. నూతనముగా లైసుతేర్పాటులయి ప్రజలకుహానికరముగానున్నవి. యీనూతనయేర్పాటులవలన కొన్నికొన్ని గ్రామాదులు నలువైపుల మహామారానోఖచుట్టడింపబడి ప్రజలు కదగండ్లను పాలుపడుచున్నారు- ఉదాహరణముగా తాలూకాఆసిఫాబాదలోని కటోడి,మాలన్‌గొంది, మున్నగుగ్రామాదులను పరీక్షించినయో యధార్థముబయటపడును- పాపము ఆయాగ్రామప్రజలు వీరిబెదరింపులకే సగమవుచున్నారు- అడవిలోని వృక్షములనువరికించి కోపులను గావించుటయందు ఆయాగ్రామప్రజలు వెట్టిలోకిగొంపోబడుటయు వారములుపనిచేసినను చిన్నమొత్తైనఇవ్వక బాధించుటయు జరుగుచువచ్చుచున్నది. మరియు ప్రతి అరకకు, రెండేసి రూపాయలును, అంతకెక్కువదిగుబడును పంటలపైన గైకొనుచుండుటయు జర్గుచువచ్చుచున్నది. వేయేల యీవెట్టిదురాచారము ప్రజలను వివిధవేదనలకు గురికావించుచువచ్చుచున్నది ఖజానాల యెసుమతిదిగుమతి సందర్భము అందుఅరబ్బులుచేయునట్టి దౌర్జన్యము అనిర్వచనీయమని నుడువగలను.

గమనిక యివన్నియు అన్యాయా క్రమణలే. అత్యాచారములే. సంవత్సరములుగడచినను కక్షిలపైగక్షిలువెల్వడినను అరికట్టబడకుండుటకు గల కతంబెద్దియో పాఠకులే గ్రహించగలరు, యిట్లు సాహుకారులయొక్కయు తదితరులయొక్కయు బాధలసహించుచు యెన్నిసంవత్సరములు గడుపవలసినదోతెలియకున్నది. యీలాంటిఅక్రమములు జరుగుచుండుటకు సంఘసమావేశములు లేకుండుటయు ఇంతకుమించిన వేరే లోపమెద్దియును లేదనుట నిస్సంశయమనకతప్పదు. మనచల్లని దయామయులగు ప్రభుత్వమువారి దృష్టికివచ్చిన అరికట్టబడుననుటకలదు. ఇక ప్రాంతీయమహాసభయనబడు ఆంధ్రమహాసభవారలైనా వీరినిగురించి తగున్యాయమునకల్గించుచున్నారా? అదియునులేదు-అయినను భావిపరిస్థితులను బాగుపరచుటకై ఆయాఅధికారులును సంఘసంస్కర్తలును ధర్మకంకణముధరించిననేగాని ప్రజలు ఆర్థిక, నైతిక నైసర్గికదౌర్బల్యమునుంచి విముక్తులు కాజాలరు-వేయేల, ఆంధ్రసభముఖ్యనాయకులలోకొందరగు మహబూబ్‌నగర్ జిల్లానివాసులనియు అధికముగా వీరుఆజిల్లాపై అభిమానమును చూపించుచున్నట్లును పర్యటనలుగావించుచున్నట్లును, ఇందులకు ఆయాసందర్భములందలి పత్రికాప్రకటనలేనిదర్శనమనియు చెప్పగలను- కావున వీరు ఆజిల్లాతోసహా మాజిల్లాపైనను తగుఅభిమానమునుచూపించిననేగాని మా స్థితిగతులు తెల్లడికానేరవు-ఆంధ్రనాయకులు మాజిల్లాలో విరివిగా ఈసంవత్సరమైనా ప్రచారముచేసి ముఖ్యముగా గోండులస్థితిగతులను విచారించి ఒకనివేదికను ప్రకటించి వారి నుద్ధరించగలరని ప్రార్థించుచున్నాను.

(ముగిసినది)

---

## గ్రంథాలయ పునరుద్ధరణ

(ఓ.వి.) నల్లగొండ ౨౫-౯-౫౦

ఇచట పూర్వమునుండి ఆంధ్రసరస్వతీనిలయము, భారతీనిలయమను రెండు గ్రంథాలయములు కలవు. ఆంధ్రసరస్వతీనిలయము ౫-౬ సంవత్సరములనుండి స్థానిక ఆంధ్రనాయకుల అశ్రద్ధవల్ల మూయబడియుండెను. భారతీనిలయమును స్థానిక ఆర్యసమాజమువారు సక్రమంగా జరుపుచుండిరి. స్థానికయువకుల ప్రోత్సాహమున ౨-౬-౫౦ నాడు శ్రీ డాక్టరు డి.వి.గోపాల్ రావుగారి అధ్యక్షతక్రింద ఒక సభసమావేశమాయెను. శ్రీ భద్రదేవుకేగారు గ్రంథాలయములు వాటిఆవశ్యకతను గురించి ఉపన్యసించిరి. ఆంధ్రసరస్వతీనిలయము భారతీనిలయము రెండుగ్రంథాలయములు కలిపి సక్రమంగానడుపుటకు తీర్మానింపబడెను. కార్యవర్గము ఈక్రిందివిధముగా ఎన్నుకోబడెను.

అధ్యక్షుడు శ్రీ డాక్టరు డి.వి.గోపాల్ రావుగారు
ఉపాధ్యక్షుడు శ్రీ పాండురంగారావుగారు
కార్యదర్శి శ్రీ టి.ఆర్. నట్రాజగారు
సహాయకార్యదర్శి శ్రీ జి. బుచ్చయ్యగారు
కోశాధ్యక్షుడు శ్రీ కోటివీరప్పగారు
పుస్తకాధ్యక్షుడు శ్రీ డి. వెంకటరాం రావుగారు

గ్రంథాలయమునకు శ్రీ దోమలపల్లి వెంకటరాంరావుగారు వారిసొంతభవనమునొకపెద్దహాలు కిరాయలేకుండాయిచ్చి కృతజ్ఞతకు పాత్రులైరి. గ్రంథాలయమున పఠనాలయముకూడా కలదు. వివిధపత్రికలు వచ్చుచున్నవి. గ్రంథాలయము తెలుగుపుస్తకములు ౫౦౦హిందీ ౧౫౩ఇంగ్లీషు (౫౦)వుర్దు (౨౧౧) మొత్తము ౧౦౧౪ పుస్తకములున్నవి. ఆంధ్రసరస్వతీనిలయంలో చాలాపుస్తకములు చెదలుపట్టిచెడిపోయినవి. మంచిపుస్తకములు కొన్నిమాత్రమేలభించినవి. ముఖ్యముగా ఈ గ్రంథాలయమున మన మతగ్రంథములగు ఋగ్వేదము యజుర్వేదమువాటి భాష్యములు ౧౩ వాల్యూములున్నవి. వీటిని కీ. శే. శ్రీ కోమరగిరి లోకేశ్వరరావుగారు భారతీ నిలయమునకు దానమొసంగియుండిరి.

గ్రంథాలయమునకు శ్రీ టి.కె. రత్నస్వామిగారు ౫౬ పుస్తకములు శ్రీ ఆరూరు విశ్వనాథంగారు ౫౦ పుస్తకములు శ్రీ మందాళపు అచ్చయ్యగారు ౧౦౪ పుస్తకములు దానమొసంగిరి. కొండకిరంధూస్వాములగు దోమలపల్లి యాదగిరిరావుగారు ౫౦ పుస్తకములను మరియు ౧ పెట్రొమాక్సులైటు దానమొసగి ౧౦౦ రూపాయలు విరాళము విచ్చుటకువాగ్దానముచేసి అందరికృతజ్ఞతకుపాత్రులైరి, శ్రీ ముష్యాసినాగేంద్రగారు రు౧౩ గుప్తదానము రు౧౩ కంచెర్లరాజన్నగారు రు౧౩ యెంద్రపుళ్ళలింగయ్యగారు రు౫ విరాళములొసగిరి. ప్రస్తుతము ప్రతినెల రు౧౫ చందాలువసూలగుచున్నవి. దీని అభివృద్ధికై స్థానిక యువకులు విద్యార్థులు చాలా పాటుపడుచున్నారు–

## హైస్కూలు విద్యార్థిసంఘటన

సోమవారం ౨౫-౯-౫౦ నాడు సుమారు ౨ గంటలకు కే.సీతారామారెడ్డిఅను ఒక ౩వ తరగతి విద్యార్థిపాఠశాలకు సైకలుపై పోవుచుండెను. అంతలో పోలీసు సబ్ యినిస్పెక్టరుగారుకూడా సైకిలుపై వచ్చుచుండిరి. వీరియిద్దరిమధ్యలో బస్సునిల్చియుండెను. అమీనాగారు రాంగుసైడుపైవచ్చుచుండుటచే విద్యార్థిసైకలుగిల్ల వారిసైకలుగిల్లకుతగిలెను. వెంటనేవారు క్రోధావేశులై చెంపలువాయించి లాగుకొనిపోయి రిమాన్డులో నుంచిరి. ఈసంగతి పాఠశాలలో మాకుతెలువగనే మేమందరముకలిసి అమీనాకచేరీకిపోయితిమి. అక్కడ సబుయినిస్పెక్టరుగారులేనందున చక్కా తాలుక్దారుగారివద్దకువెళ్ళగా వారు మొదటిని పోలీసుమొహతమిమాగారికి విద్యార్థిని వదలుటకుచెప్పంపిరి. మాసమక్షమున వారు యీవార్తవిని అమీనాగారిని పిలిపించి పిల్లవాణ్ణి ప్రస్తుతమువదిలివేయుమనుచు,తరువాతతగుచర్య జరుపబడునని ఆజ్ఞాపించిరి. అప్పుడువిద్యార్థివదలివేయబడెను. మేమందరము మామేరకలిసంతోషమును ప్రకటించుచు కృతజ్ఞులమైతిమి. కానియికముందు యేమిచర్య తెలుపబడునో తెలియదు.

ఇట్లు
విద్యార్థులు

[౫ మంది సంతకములతో పంపినవార్త]

## ఆత్మహత్య

సదాశివ పేట

వీడుయిక్కడ శరణుడను సాధుపురుషుడు ఉరిచేసుకొని ప్రాణములగోల్పోయెను అతడిక్కడికివచ్చి దాదాపురెండుసంవత్సరములుకావచ్చెను కొన్నిదినములనుండి భార్యాపిల్లలతో తమ్మునితో సహావచ్చి గ్రామంబెలుపల పూజారిరాచయ్యగారిధర్మశాలలో కాపురము చేస్తూయుండిరి. కాని యేకారణమువలననో ఆదివారంరాత్రి అందరూ పరుండినదిచూచి ఉరిచేసుకొనిచచ్చెను.

## వర్షము

ఇక్కడ మూడురోజులనుండి వర్షముచక్కగాపడినందుకు చాలాకాలమునుండి వర్షములేదని నిరీక్షించుచున్న రైతుకాపులుచాల సంతసించిరి, పైరులకు పశువులకుచాలలాభకరముగా వర్షము కురిసెను.

# గోలకొండపత్రిక

వృషనామసం॥ర ఆషాఢ శు॥౧౩

సోమవారము


## రష్యా

రష్యా జర్మనీయుద్ధము మూలాన ప్రపంచమంతటను ఇప్పుడు రష్యా చర్చకు వచ్చినది. రష్యాచరిత్ర చాలా ప్రాచీనమైనది, అదొకఖండమేకాని ఒక దేశమని కూడా అనిపించుకొనదు. యూరోపులో సగముభాగము, ఏషియాలో నాల్గవభాగముకలిసి ఈ భూభాగమైనది. మనహిందూస్థానము బర్మారాష్ట్రముతోసహా ఎంతఉన్నదో అంత ఎనిమిదంతల దేశము రష్యాదేశమైయున్నదనిచెనినతర్వాత అదెంతటి గొప్ప ఖండతుల్యమైన ప్రదేశమో ఊహించుకొనగలము. అయితే ఇంతటివిశాలదేశములో ౧౭౦కోట్లమందిమాత్రమే ఉన్నారు. మన భారతదేశములో ౪౦ కోట్లమంది ఉన్నారు. మనదేశజనసంఖ్య ప్రకారం రష్యావైశాల్యం మనదేశమంతఎనిమిదంతలున్నందున అచ్చటి జనసంఖ్య ౩౨౦ కోట్లు ఉండవలసియుండెను. ఆవిధంగా లేనందుకు కారణమేమంటే రష్యాలో సగంభాగం మంచుగడ్డలతో నిరంతము నిండియుండి నివాసయోగ్యంగా లేదు. చాలాభాగం అరణ్యభాగమైయున్నది. ఏమైనాసారవంతమగుభాగ మున్నదంటే అది రష్యాకు దక్షిణభాగంలో ఉన్నది. ఆభాగంలోని యూక్రేను మండలము అతిసారవంతమగుప్రదేశము. మొత్తము రష్యాదేశములో ఎంతపంటపండుతుందో అందుమూడవభాగం ఒకచిన్న యూక్రేన్‌మండలంలోనే పండుతుంది. అట్టి యూక్రేనుపైననే హిట్లరు కన్నువేసినాడు.

రష్యాదేశం మనభారతదేశంతో కొంతవరకు పోలియున్నది. రష్యాలో ౧౯౧౭ వరకు "జార్"అను బిరుదుగల చక్రవర్తులు నిరంకుశపరిపాలన చేయుచుండిరి. జారుచక్రవర్తులనిరంకుశత్వము చెప్పశక్యముకానంతటి ఘోరముగానుండెను. మాట్లాడితే తప్పు. అనుమానం వస్తే తలతెగురగొట్టబడేది. పనందుకాకపోతే తూర్పుననుండు సైబీరియామంచు అడవులలో యావజ్జీవంకారాగారవాసంలోబంధించివేయుచుండిరి. ఈఘోరాలనుండియే బొల్షివిజం,కమ్యూనిజం, సోషలిజం అనుసామ్యవాద సిద్ధాంతాలు బయలుదేరెను. ఈ సిద్ధాంతాల ప్రచారంచేసినవారు, వారిచరిత్రలు, అవన్నీ చెప్పబూనుకుంటే అంతమేఉండదు. మొత్తానికి ౧౯౧౭లో రష్యాజనులకు జర్మన్ యుద్ధంతోడ్పడెను. వారు తమ చక్రవర్తిపై తిరుగబడిరి. రాజును, రాజకుటుంబాన్ని చంపివేసిరి. సామ్యవాద సిద్ధాంతముతో దేశములో ప్రజారాజ్యం స్థాపించిరి. దానినే సోవియట్ సిద్ధాంతమందురు. ఇప్పుడు రష్యాదేశాన్ని యూ. యస్.యస్.ఆర్.అందురు. అనగా సోషలిస్టుసోవియట్ రష్యా రాష్ట్రాల సంయుక్తమండలముఅని అర్థము

భారతదేశములో నానాభాషలు నానామతాలు, ఎట్లున్నవో రష్యాలోను అట్లేయున్నవి. రష్యాలో ౧౭౦ భాషలు మాట్లాడుతారు. అయితేచాలాభాషలు కొద్దిసంఖ్యాకులకు సంబంధించినవై యున్నవి. రష్యాలో ఇన్నిభాషలున్నను ఏ ఒకభాషకుమాత్రమే ప్రాధాన్యత నిచ్చి తక్కినభాషలను చంపుయత్నమేమిన్నీ చేసిన పాపానపోలేదు. పాఠశాలలలో, కచ్చేరీలలో మండలభాషకే ప్రాధాన్యత నిచ్చినారు. రష్యాలో ముఖ్యమైనజాతులలో ఫిన్నులు, తెల్లరష్యనులు,గ్రీకులు, యహూదీలు, తుర్కులు,తార్తారులు, ఆర్మెనియనులు కలరు. అయితే ప్రధానమైనజాతి స్లావ్ అనుపేరుగలజాతి. రష్యాదేశములో లోహములు గనులు చాలా ఉన్నవి. కాకేషియాపర్వతప్రాంతములో నూనెగనులు చాలాఉన్నవి. ప్రపంచంలోని గ్యాస్‌నూనె గనులలో మొదటిస్థానం అమెరికాది. రెండవదర్జా రష్యాది.

[illegible]గా జనులుఆకుకూరలను [illegible] దేశమైనప్పుడుమన్నారని తెలియవచ్చినది, స్థిరపడి [illegible]తిసేవారుతప్పకుండా ఆకుకూరలను [illegible] విన్నందును— ఎందుకనగా ఆకుకూరలలో [illegible]నకు [illegible]పదార్థాలున్నా(విటమినులు)లోవా [illegible] (Mineral salts) ఉన్నవి. [illegible]లదై యములోను గడ్డలలోనుకూడా మంచివిగనువారు [illegible] ఆకుకూరలే అన్నింటిలో [illegible]గనిస్థా[illegible] [illegible]జలుఎక్కువ [illegible]స్థానము మీదికి [illegible] సమృద్ధిగాతి[illegible] [illegible]పాయం రాజకీయవేత్తలు కొందరకు [illegible]యిచ్చుచున్నారు.ఇంతకన్న మించినప్రమాదం హిందూస్థాన చరిత్రలో ఇదివరకుండలేదు. ఇక ముందును ఉండబోదు ఈసందర్భములో దేశనాయకులుకూడా బ్రిటిషుప్రభుత్వానికి తోడ్పడవలెను. వీరుతోడ్పడుటకై ముక్తకంఠముతో ప్రచారంచేసిన దేశ స్వరూపము ఒక్కక్షణంలోమారి ఎక్కడలేనిఉత్సాహం ప్రజలకందరికిని కలుగును కాని మనదురదృష్టముచేత కాంగ్రెసును ముస్లింలీగును తదితరసంస్థలను నడుపునాయకులు మౌనముద్ర వహించియున్నారు. బ్రిటిషుప్రభుత్వమువారు వీరితో సమాధానపడుటయు చాలా అవసరము.

## మరల ఇండియా చర్చ

### మిరల అమెరీ జవాబు

కామన్సు పార్లమెంటుసభలో ఒక సభ్యుడు రష్యాతోడి యుద్ధ సంప్రతింపులలో ఇండియాకేమైనా స్థానమున్నదా అని ప్రశ్నించెను. దానికి అమెరీగారిట్లన్నారు, ఇప్పటిసమస్య సామ్రాజ్యానికంతయు సంబంధించినదైనందున ప్రత్యేకముగా హిందూస్థానముతో సంబంధము లేదు.

యుద్ధములోని సంబంధములో ఇండియాకుగల అధికబాధ్యతనుగురించి ప్రభుత్వమువారింతలో ఒకసమగ్రమైన సమాధానమును ప్రకటించగలరాఅని ఒకరడిగిరి.

అమెరీగారిజవాబు—"అవును" మనంరష్యాకుపంపిన సందేశంవిషయములో ఇండియాగవర్నమెంటు తృప్తిపడినదాఅని మరొకరు ప్రశ్నించిరి.

అమెరీగారిజవాబు—"అవును" "తద్విరుద్ధముగా అనుకొనుటకు కారణము కానరాదు."


ఆషాఢ ప్రథమైకాదశికొరకు పత్రికా కార్యాలయము శనివారమునాడు మూయబడెను.అందుచేత ఆరు పుటలు మాత్రమే ఈ తడవ ప్రకటింపబడినవి.

మేనేజరు,
గో. ప.


## ఆత్మరక్షణకై హింస అవసరము

మాలవీయగారి భావ ప్రకటన

౨౭ౌ౧ వతేదీనాడు కాశీలో హిందూనాయకులను పండిత మదనమోహనమాలవీయగారు పిలిపించినారు. ఇప్పుడు హిందూస్థానములో చాలానగరాలలో జరుగుచున్న హిందూముస్లిం కలహాలను గురించి ఆలోచించినారు, ఆసందర్భంలో మాలవీయగారు హిందూనాయకులనుద్దేశించి ఈ క్రింది విధంగా ఉపన్యసించినారు,

ఆత్మరక్షణములోకూడ హింసా ప్రయోగము కూడదని మహాత్మాగాంధీగారు బహుకాలమునుండి బోధించుచున్నారు. ఈ విషయములో నేను వారితో ఏకీభవింపలేకపోయినాను. పురాణకాలములో మనుమహర్షి యున్నూ వేదవ్యాసుడున్నూ ప్రతిమనిషి ఆత్మరక్షణములో హింసతో ప్రతిఘటింపవచ్చునని శాసించినారు. అంతేగాక మెండుకు ఇప్పటి ఇండియన్ పీనల్‌కోడులోను మనిషి ఆత్మరక్షణలో బలప్రయోగము చేయుట అంగీకరింపబడినది.

మహాత్మాగాంధీగారి బోధనలన చాలామంది వారిసిద్ధాంతమును అంగీకరింపబోచ్చినారు. కాని అట్టిజనులుకూడా బలాన్ని బలముతో ప్రతిఘటించేవిషయంలో అంగీకరింతురు. ఇప్పటిఅల్లరులలో చాలామంది అమాయకులు నష్టపడినారు. వారి ధనము, వారిప్రాణాలు. వారి స్వాతంత్ర్యము అపాయాన్ని పొందినవి. పరస్పరసముఖతజనులలో ఉండిన ఈఅల్లరులుసాగకేరవు హిందూరాజ్యము ముస్లింరాజ్యంఅనే భావాలు వ్యర్థముచ్చట్లు ముందుకాలములో ఈ దేశములో హిందూ ముస్లిం సిక్కు క్రైస్తవ పార్సీ మున్నగు జాతులందరికిసమానమైన సమిష్టిరాజ్యంఉండగలదు,కాంగ్రెసునుదూషించరాదు, అందరున్నూ ఐకమత్యమునుపొందవలెను. బ్రిటిషుపరిపాలకులు ఈదేశములో ఆయుధనిషేధశాసనముచేసి మన కుపకరించినారు. ఇంతకన్నమించిన అన్యాయంమరేదిన్నీ లేదు. పూర్వంలో అందరునూ ఆయుధాలుపట్టే కాలములో దొంగలు బందిపోటుమందికూడా తమదుష్కార్యములను చేయుటకు భయపడుచుండిరి.ఇప్పటిఅల్లరులలో గుండాలు మనిషికి ఎదుట నిలబడి వానితో యుద్ధము చేయుటలేదు-వారు పిరికివారై దొంగతనముగాపీపునపొడిచి పారిపోవుచున్నారు. గుండాలు దొంగతనంగా కత్తులుపట్టుకొని లూటీలుచేయుచున్నారు— కాని శాసనబద్ధముగా జీవించువారికి కత్తులుపట్టలేకున్నది దొంగకగు. అహింస చాలాఉత్తమమైనదే. కానియిప్పటిపరిస్థితులలో వానితో పీలులేనందున హింసతోనైనను ప్రతిఘటించి ఆత్మరక్షణ చేసుకోవలెను.

మాలవీయగారి ఉపన్యాసానంతరం హిందూనాయకులు హిందువులు ఆత్మరక్షణ స్వచ్ఛంద సంఘాలను ఊరూర స్థాపించవలెనని నిర్ణయించిరి.



## ఇష్టాగోష్టి-ఆంగీరసుడు

మదరాసుపోతే?

మనకుమదరాసుపట్టణము ఆంధ్రరాష్ట్రనిర్మాణములోనికి రాకుండాపోతే? ఐశ్వర్యవంతము కాబోవు విశాఖపట్టణమున్నది అన్నారు శ్రీభావరాజు వెంకటకృష్ణరావుగారు విశాఖపట్టణభావినిగురించి "ఆంధ్రపత్రిక"లో వ్రాయుచు కృష్ణారావుగారు సామాన్యులుకాదు, రాజమహేంద్రవరములో వకీలు ఎం.ఎ.బి.ఎల్. ఆంధ్ర ఇతిహాసమండలి ప్రతిష్ఠాపకులలోముఖ్యులు, ప్రకృతపుకార్యదర్శి. ఆంధ్రవిశ్వవిద్యాలయ శిష్టసభలోసభ్యులు (సెనేటరు) గొప్పవిజ్ఞాని రచయిత ఒడలుతెలియని ఆంధ్రాభిమాని ఇట్టిప్రముఖుడు ఏబాధ్యతవహింపకుండ ఉద్రేకముతోయిష్టమువచ్చినట్లు పత్రికలకువ్రాయుట ఉచితముగలేదు. వెనుక ఒకసారివీరు రాయలసీమను "రాళ్లసీమ"యని ఆక్షేపింపగా రాయలసీమవారు చాలానొచ్చుకొనిరి. అరవవారు మనకుమదరాసు ఎట్లాగూదక్కనివ్వరుగాన చెన్నపట్టణమువదలిపెట్టుకొని విశాఖపట్టణమునుచూచి గర్వపడుచూ సంతోషించెదమన్నారు.

ఔను బరంపురము ఓఢ్రరాష్ట్రమునకుపోతేనేమి? పర్లాకిమిడికిగోల్కొండతేనేమి! కర్నాటకులు చాలపట్టుదలగానున్నారుగాన బళ్లారికర్నాటకములోచేరితేనేమి? బహద్దర్ యార్జంగుగారు తీవ్రాందోళన గావించుచున్నారుగాన ఉత్తరసర్కారులు హైదరాబాదు ప్రభుత్వములోచేరితేనేమి? ఇ.వి.రామస్వామినాయకరుగారు "ద్రావిడస్థాను" పూర్ణస్వతంత్ర తమిళనాడు నిర్మాణసందర్భములో మహమ్మదలీ జిన్నాగారితో రాజీపడి రాయలసీమను ద్రావిడస్థానులోకలుపుకొనుటకు తీవ్రయత్నముగావించుచున్నారట అట్లయితేనేమి? జిన్నాసాహెబు ఇండియాను రెండుభాగాలుగావిభజించి పాకిస్థానును వేరుగాచేయవలెనని ఆందోళనగావించుచున్నారు. పోనీ అందులకంగీకరిస్తేనేమి? ఈవాదానికి అంతులేదు.

మదరాసు ఆంధ్రులదని ఆంధ్రమహాసభవారు గట్టిపట్టుదలతో కృషిచేయుచున్నారు. తమిళులు తమదేదని ఘీంకరించుచున్నారు— పోటాపోటీని ఆంధ్రులకును తమిళులకునుమధ్య చెన్నపట్టణ యాజమాన్యతకై జగడముజరుగుచున్నది—ఇట్టి సమయమున కృష్ణరావుగారివంటి ఆంధ్రచరిత్ర కారుడుకలమునకువచ్చినట్లు తీవ్రముగ బాధ్యతనుగుర్తింపక పత్రికలలోవ్రాయుట యుచితముగలేదు— శైశాఖమహాదైశ్వరము ననుభవించుగాక! మనము మదరాసుహక్కును బోగొట్టుకొనరాదు. చెన్నపురిని ఆంధ్రనగరముగా ఆంధ్రులు నిలబెట్టుకొందురుగాక.

### చిలుకూరు ఆంధ్రమహాసభ

శ్రీమందుముల రామచంద్రరావుగారు సానుభూతి తీర్మానముసెదిరించుచూ చేసినప్రకటన లువిపరీతధోరణినియున్నవి. ఆంధ్రమహాసభరాజకీయముగా మారినదట, మంచిదేను. అట్లగుట అభివృద్ధిసూచించును— రాజకీయముగా మారితేఏమంటారు? ఆంధ్రమహాసభలో "భాషకుస్థానంలేదంటారా? ఈరీతిగభారతవర్షములో నెరరూపనియుండవలెనే. మహాత్మాగాంధీ గుజరాతీ వాఙ్మయమునకు నూతనవికాసము "నవజీవన" పత్రికద్వారా కలిగించెనని గుజరాతీయులు చెప్పెదరు శ్రీ॥ శే॥ చిత్తరంజనదాసు వంగభాషలోకవియైగ్రంథరచనలు చేసియుండెను ఆంగ్రేయరత్నసుగ్రిరాలగోపాల కృష్ణయ్యగారు ఆంధ్రములో ప్రౌఢపండితుడై ఆంధ్రభాషాభివృద్ధిని కోరియుండెను.

కాని ౧౯౩౯ సం॥ అ ఖారాజకీయానుభవములో భారతవర్షములో ఏనాయకుడును రాష్ట్రములలో కాని కేంద్రములోకాని ఏరాజకీయమహాసభలోను"భాషకుస్థానములేద"ని ప్రకటింపలేదు. ఆంధ్రరాష్ట్రీయ (రాజకీయ) మహాసభలో ఆంధ్రభాషావేత్తలను ప్రతిసంవత్సరము సంస్మరించుచూవచ్చుచున్నారు, తెలుగుసాహిత్యములో బొత్తిగాపరిచయము తక్కువగానున్న శ్రీ ౧ంగుటూరి ప్రకాశం పంతులుగారుకాని శ్రీబులుసుసాంబమూర్తిగారుకాని అందు "భాషకుస్థానము" లేదనుచు సదరుసభ్యారక తీర్మానముల నెన్నడునూ ఎదిరించియుండలేదు. రాజకీయసభలో "భాషకుస్థానములేదా? గాంధీమహాత్ముని ప్రోద్బలంచేతను కాంగ్రెసుప్రోత్సాహమువలనను కాంగ్రెసునాయకుల యుద్బోధలవలనను యావద్భారతములోను హిందీభాషప్రచారము చేయుచున్నారు, ఆసేతుహిమాచలపర్యంతము ప్రతిరాజకీయనాయకుడు మాతృభాషదానియభివృద్ధిని గురించివేనోళ్లఘోషించుచున్నారు. మందుములరామచంద్రరావుగారికి వారిమాతృకయగు ఆంధ్రములో పరిచయములేకపోవచ్చును, కానివారంత తీవ్రముగ విమర్శింపనక్కరలేదు.

సానుభూతిసవరణ తీర్మానమునుపూరించుటెట్లు? దీనికిరెండుమార్గములు, ఒకటిప్రత్యేకమహాసభజరిపి ఆమోదించుట. రెండవది, ఆంధ్రమహాసభకు ఏదిప్రాథమికసంఘమో అచటినుండి మండలసంఘము, మండలసభ, కేంద్రస్థాయిసంఘమువరకు క్రమవిభాగముచొప్పున (Evolutionary method) తీర్మానముచేయుచుండవలెను. అభయవార్షికసభలో ఆమోదించవలెను. అమ్ముగ్గురుఆంధ్రప్రముఖులనుఈ విధంగాసంస్మరించి తీరవలెను. చిలుకూరుసభలోజరిగిన పొరబాటును సవరించుట ఆంధ్రమహాజనుల ప్రథానకర్తవ్యము.

## హెస్సు ఇంగ్లాండుకు ఎందుకు వచ్చినాడు?

ఇంగ్లాండులోని టైమ్సుపత్రికలో ఇట్లు వ్రాసినారు. జర్మనీలో చాలా విశ్వాసపాత్రుడైనవాడు హెస్ అని ప్రఖ్యాతి అతడు గ్లాస్గోలో పట్టుబడెను. అక్కడినుండి మరొక స్థలంలో అతన్ని ఖైదీగా ఉంచినారు, అతన్ని వైద్యులు పరీక్షించినారు. పిచ్చి ఏమియు లేదని తెలిపినారు. అతడు కొంతకాలంనుండి పారిపొయ్యే యత్నంలో ఉండినాడు. హెస్సు మే ౧౦ నాడు ఒక విమానాశ్రయమువద్దకు వెళ్లి ఒక విమానముపై ఎక్కినాడు. హిట్లరుకు విశ్వాస పాత్రమిత్రుడుకదా అని అతన్ని ఎవరున్నూ ఆక్షేపించలేదు.

అతనిని ఇంగ్లాండుకు ఏదో ఉద్దేశంతో జర్మనీవారే పంపినారనే అవకాశం లేదు. అతడేమిన్నీ సందేశాలంతేలేదు. జర్మనువారేదో యుత్తు వేసినారనుటకున్నూ కీలులేదు, హెస్సు ఉద్దేశపూర్వకంగా నేపారివచ్చినట్లు కనబడుతుంది, అతనికి హిట్లరు చర్యలు అసహ్యమైపోయినవి. రక్తపాతాలు ఎక్కువైనందున అతడు విసుగుకొన్నాడు. అతడు శాంతికోరినాడు. జర్మనీలో జనులు స్వయంగా ఆలోచించుపద్ధతి వదలినారు. హిట్లరు చెప్పిన ప్రకారంగుడ్డిగా నడుచుకుంటారు అనేవాలకం ఉండేంది, ఇప్పుడు హెస్సు చర్యవలన అభావనపోతూఉన్నదనవలెను. జర్మనీవారు హెస్సుపలాయనాన్ని మసికన చేయజూచుచున్నారు. కానిదాని అంతరార్థంచూస్తే జర్మనీపైదానిప్రభావం చాలా పడగలదు.

## జర్మనుయువతి హిందూ మతంలో చేరింది

మద్రాసు, జూను ౨౫:

మద్రాసు ఆర్యసమాజ్ భవనంలో మిస్-ఆవనీ సెల్ అనేజర్మను యువతిని హిందూమతంలో చేర్చడానికి శుద్ధిజరిగింది.

ఈమెది ఆస్ట్రియాలో వియన్నానగరం, ఆర్యసమాజం పద్ధతులమీద శుద్ధిజరిగినతర్వాత ఈమె మాయాదేవి అనేపేరు అవలంబించింది. వయస్సు ౨౫ ఏండ్లు, అవల, బోగ్రా (బెంగాల్) లోని ఎ, హెచ్. కాలేజిప్రిన్సిపలగు డాక్టర్ కె.పి ముఖర్జీగారికి మాయాదేవికి వివాహంజరిగింది, పండిత కె. జ్ఞానిగారు పురోహితులుగా ఆర్యసమాజంలో చేర్చి, వివాహమహోత్సవం జరిపించారు,

ఆర్యధర్మములను చక్కగా పాటించవలెనని ఆర్యసమాజసిద్ధాంతములను అవలంబించి జన్మసాఫల్యం చేసుకోమని పండితజ్ఞానిగారు వధూవరులకు హితవుచెప్పారు.

జాతి,మత,వర్ణ, దేశభేదములరూపుమాపి ప్రపంచంలోనిప్రజలనందరిని సమానులుగా చూడడమే ఆర్యసమాజంయొక్క ఆశయమనికూడా వారికి తెలియజేశారు.

(ఆంధ్ర పత్రిక)

## బలవర్ధకాహారము

మద్రాసు ప్రభుత్వమువారు ఆరాష్ట్రములోని లోకల్ బోర్డులవారు ప్రచారముచేయు నిమిత్తమై ప్రజలుఎట్టిఆహారమును తింటేఆరోగ్యవంతులుగాఉందురో డాక్టర్ల అభిప్రాయమును కనుగొనిఒకప్రకటన చేసియున్నారు. అదేమనగా

గ్రామాలలో వైద్యంచేసేవారున్నూ, సర్కారీడాక్టర్లున్నూ, మునిసిపల్ లోకల్ఫండు డాక్టర్లున్నూ, ప్రజలుఎక్కువగా కూరగాయలను అందులోను ఆకుకూరలను బాగాతినవలెననిదని ప్రచారము చేయుచుండవలెను, హిందూస్థానములో అన్నిప్రాంతాలలోను విచారణచేయించి చూడగా జనులుఆకుకూరలను కాలాతక్కువగా వాడుచున్నారని తెలియవచ్చినది, బియ్యమున్నమతినేవారుతప్పకుండా ఆకుకూరలను తినవలసియుండును- ఎందుకనగా ఆకుకూరలలో బలమిచ్చుపదార్థాలున్నూ (విటమినులు) లోహలవణాలున్నూ (Mineral salts) ఉన్నవి- కాయగూరలలోను గడ్డలలోనుకూడా మంచిబలమున్నది కానిఆకుకూరలే అన్నింటిలోమేలైనవి- కావున ప్రజలుఎక్కువ కూరగాయలను ఎక్కువఆకుకూరలను సమృద్ధిగాతిని ఆరోగ్యమువృద్ధిచేసుకొనవలెను-

## పన్నాలాలుగారి దానం

కేశవ మెమోరియల్ పాఠశాల

కీ.శే. న్యాయమూర్తి కేశవరావుగారి స్మారకంగా ఆర్యసమాజంవారు హైద్రాబాదునగరంలో ఒక మాధ్యమిక పాఠశాలను స్థాపించి ఒకసంవత్సరమునుండినడుపుచున్నారు, ఆట్టిపాఠశాలకు రాజాసర్ బన్సీలాలుగారికుమారులైన రాజా పన్నాలాల్ పిటీగారు రాజాగోవర్ధనలాల్ గారును ౫౦౦౦రూపాయిల విరాళమును అనుగ్రహించియున్నారు.

## వి. రామచంద్రరావుగారు

వామనునాయకుగారి స్మారకదినము నాడుఉపన్యాసమిచ్చి జెయిలుశిక్ష అనుభవించుచున్న వి-రామచంద్రారావుగారు హిందూప్రజామండలి కార్యదర్శిగాఉండెను, జెయిలువారు దొంగతనాలున్నగు దుష్కార్యాలుచేసిన సామాన్య ఖైదీలకిచ్చుఆహారమునే వి. రామచంద్రరావుగారికిచ్చుచుండుటవలన వారిఆరోగ్యం చెడినదనిన్ని అందుచేత జెయిలుఅధికారులు ఆతనికిమంచిభోజనమిచ్చి ఆరోగ్యము గారక్షించవలెననిన్ని వై, డి. జోషీగారు జిల్లాపోలీసుడైరెక్టరుగారికి విజ్ఞప్తిపెట్టుకొన్నారు-

## విజ్ఞాననికేతనము

ఖమ్మంమెట్టువర్తక సంఘమువారు దిగ౨౬-౬-౪౧ తేదీ మహాజనసభ అసాధారణసమావేశమునందు శ్రీవిజ్ఞాననికేతనమునకు విజ్ఞానప్రచారమునకై నెల-కి రూ ౧౫చొ॥ కొంతకాలమువరకు యివ్వనిశ్చయించినారని తెలుపుటకుసంతసించుచున్నాము. వర్తకసంఘమువారి ఈఔదార్యము ఎంతయోప్రశంసనీయము, నికేతనపక్షమున సంఘముసభ్యులకు మనఃపూర్వకమైన కృతజ్ఞతావందనములు సమర్పించుకొనుచున్నాము. మునుముందుఈసంఘము అభివృద్ధిజెంది నికేతనమునకుఇంతకన్న నమిక్కిలిగాదు ఇతరప్రజా ఉద్యమములకును సహాయముచేయునని ఆశించుచున్నాము.

ఇట్లు
కోదాటినారాయణరావు,
కార్యదర్శి

## కావలెను

మెట్రిక్యులేషన్ పరీక్షకు ప్రైవేటుగా చదివి హైదరాబాదునగరములో జరుగుపరీక్షలకు హాజరౌనువారు కావలెను, ఆడవారు మగవారుకూడ తయారుచేయబడుదురు- చదువు యిచ్చుటకు వచ్చిగాని, పోస్టుద్వారాగాని చదువుకొనవచ్చును. ఇచ్చుటకువచ్చి చేర్చుకొనువారికి భోజనగృహ వసతులుగలవు ఈనెల 15 వరకే చేర్చుకొనబడుదురు- సీట్లునిండినవెనుక చేర్చుకొనబడనందున వెంటనే చేరవలెను. ఇచ్చటకువచ్చి చదువుకొనువారలకు నెలకు జీతము రూ- 6/- పోస్టల్ ట్యూషన్ వారికి రూ- 7/-

వివరములకు,
పాపులర్ కెమిస్ట్సు-
కె ఇ, యం, హాస్పిటల్ ఎదుట సికింద్రాబాదు

SAHARA
SAHARA CHEAP
15 అణాలకు 10

## చందాదారులకు మనవి

చందాదారులు మా కార్యాలయమునకు జాబులు వ్రాయునపుడు, మనిఆర్డర్లు బంపునపుడు, తమ చందానెంబరు వ్రాయుటయందు తగుశ్రద్ధగైకొనుటలేదు చందా నెంబరు వ్రాయనిది వెంటనే జవాబీయుటకు వలనుపడదు. కావున చందాదారులెల్ల ముఖ్యముగ గమనింపగోరెదము.

మేనేజరు, గోలకొండపత్రిక.



## ప్రకటన

ఆబ్కారి మామిలాలను కోరువారందరికి తెలియపరచడమేమనగా యీప్రకటన వ్రాయబడిన స్థలములందు మరియు తారీ లనాడు ఆలీజనాబు నాయబునాజిం సాహెబు ఆబ్కారిసింతుఖారుంగారి ఇజ్లాసుపైన జిల్లా అత్రాఫుబల్దాయొక్క కల్లు, సారాయి, నల్లమందుమరియు గంజాయి దుకాణముల హర్రాజు సం॥౧౩౫౧ ఫ కొరకు చేయబడును. కనుక మామిలాలను కోరువారు మొకర్రరుచేసిన తారీఖులలో హర్రాజుకువచ్చి దుకాణములు పొందవచ్చును,

జాగీరుదార్లు తమ సుమాయిందలను దుకాణములు కోరువారితో హర్రాజులకు పంపగలరని ఆశవున్నది.

ఇతర సంగతులు వివరముగా మొహతెమీమ్ దప్తరు నుండి తెలుసుకోవచ్చును- హర్రాజుచేయబడు దుకాణముల పెహరిస్తు వ తప్సీలు యేలాన్ వేరే ముద్రింపబడినవి-

తారీకు ౯నుండి ౧౨ మహాశేవరు మొ॥ మస్తాకమే ఆబ్కారిబల్దాఖైరాయణగూడ కల్లు, సారాయి, నల్లమందు, గంజాయి దుకాణము తాలుఖా॥ శుమాలి, జనూబి, శర్కి గర్బివ ధాయూరు.

—

తారీ॥ ౧౮ వ ౧౯, మహాశేవరు మొ॥ సంగారెడ్డి మొదకువద్దనున్న తాలుఖా, గర్బి వ ధారూరు కల్లు, సారాయి, నల్లమందు వ గంజాయిదుకాణములు

హాస్పె (సెజుసి)ఖ
సదదుగారు మొహతెమీమ్

సంవత్సరము చందా
౬ వాలీ రూపాయిలు
ఆరుమాసాలకు
3 రూపాయిలు
బ్రిటిషిండియాలో
సం॥చందా
౫-౮-౦ శిల్లాలు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

The only
Popular Paper
That reaches
The masses
In the Dominions

Best Medium
for
Advertisement

**Volume 16** | **Hyderabad-Dn** | **Monday 7th July 1941** | **Number 19**

## విషాద తీర్మానము

౨-౭-౧౯౪౧

సికింద్రాబాద్ కంటోన్మెంటు బోర్డుసభ్యు లగు లోగడఆంధ్రమహాసభ కార్యకారిణీ సంఘసభ్యుడగు శ్రీయుత సాల్వేరురామయ్య గారిని సేనకలవినే న్యాపతిబయ కి గిడుగువారలకును ఆంధ్రమహాసభ సానుభూతి చూపించనందుకు విూయభిప్రాయమేమని అడుగగా'

మన ఆంధ్రమహాసభ (బ్రిటిషుఆంధ్రుల సానుభూతివిషయమై ఆనాలోచితమయినపని గా వించినదనియు వారికి మనకు కొలఏండ్లనుండి ఆవిశాభావసంబంధములు కలదనియు, సంస్కృతి, భాష, లిపి ఏకమనియు వారికిమనకు రాజకీయములలో వేరుఅయినను హార్దికవిషయములలో వారి మనము ఏకభాయజాలమనియు, వారికి మన ఆంధ్రమహాసభ తప్పక సానుభూతిజూపించుట మనవిధియని తెలిపినారు.

(ఆంధ్రమహాసభ విషాదతీర్మానచర్చ యింతటితోపరి సమాప్తిచేయబడుచున్నది.గో-ప-సం)

ఇట్లు
పొద్దుటూరి పాపయ్యగారి
లింగయ్యగుప్త

మోటారుకాలుట

హనుమకొండ

౨౫ ఆమర్దాదునాడు సాయంత్రము పద్మారావుమోటారు నడిబాటలో ప్రయాణీకులను కాజీపేటకు తీసుకొనిపోవుచుండగా నిలిచియుండెను. మోటారులో ఏమో చెడిపోయెను. క్లీనరుదీపంపట్టుకొని దాన్ని బాగుచేయబోయెను. కాని దీపం విప్పి పెట్రోలుకుతగిలించేసా మోటారు భగ్గున అగ్నిదగుల్కొనిమండసాగెను. అందరున్ను నీరుతెచ్చిపోసి దాన్ని ఆర్పిరి. మోటారు ప్రయాణ యోగ్యం కాకపోయెను. ఆనాడు జోరున వర్షము కురుస్తూఉండెను- ప్రయాణీకులు అవస్థపడుచు హనుమకొండలోనే ఆగిపోయిరి.

ఇట్లు
సి. మాధవరెడ్డి
బొమ్మకల్

## బొంబాయిఅల్లరులు

బొంబాయిలో హిందూ మస్లింకలహాలుచెలరేగుచునేయున్నవి. రెండు మూడు దినాలనుండి తీవ్రతతగ్గింది. పోలీసువారు గుండాలను వెదకివెదకిపట్టికేస్తున్నారు- ౫ జూలైనాడు సుమారు ౨౦ మంది జట్టుపట్టుకొన్నారు. వీరుహోటలులో ఏమీతెలియనివారివలెఉండిరి. వీధులలోన ఒంటిగాపొయ్యే వారిని సమయంచూచి వెనుకనుండిపొడిచిపారిపొయ్యేది- వీరికికత్తులు పెద్దచాకూలురహస్యంగా సప్లయిచేసేవారుకొందరున్నారట. ఒకచోటవీరు ఒకసారాయిదుకాణంలో కూడేవారు. అచ్చటపోలీసువారువెదుకగా రక్తముతో కూడియుండినకత్తులు చాలాబయటపడినవట. కొన్నిబట్టలుకూడారక్తముతోనుండినవి దొరికినవి- ఈ ౨౦ మందిని పోలీసువారుఆరెస్టుచేసిన్యాయస్థానంలోనిలబెట్టినారు.

పవర్ ఆల్కహోలుశాసనం

హైదరాబాదు శాసనసభవారు కొన్నినెలల క్రిందటచేసిన పైశాసనముపై మ-ఘ-వ- నిజాంగారు సంతకముచేసినారు.

## పెట్రోలుధరలు పెరుగుట

హైదరాబాదురాష్ట్రములో యుద్ధమువచ్చిన తర్వాత పెట్రోలుధరలు గ్యాలను ఒకటింటికి ౨-౧-౦ హాలీవరకుపెరిగియుండెను- ఇప్పుడు యింకాధరయెక్కువగాచేయబడినది- ఇకముందు గ్యాలన్ ౧కి ౨-౩-౦ రూ॥ ధరఉండును దీని కంటెకూడా ధర రానురాను ఎక్కువఅవుతూపోగలదనిఅంటున్నారు- పైగాపెట్రోలుయిష్టమువచ్చినట్లువాడుకోకుండా అవసరమైతే పరిమితిని ప్రభుత్వంవారు ఏర్పాటుచేయవచ్చునని అంటున్నారు- అనగా ప్రతిమోటారుకు వారానికింత కంటె ఎక్కువపెట్రోలువాడుకోకూడదను నిబంధనచేయగలరు-

## ౭౦౦౦ కోట్లడాలర్ల ఖర్చు

యుద్ధానికి అమెరికావారుఖర్చు పెట్టనున్నారు

ప్రపంచచరిత్రలో ఏదేశము కూడా యింతవరకు ఖర్చుపెట్టనిమొత్తాన్ని అనగా ౭౦౦౦కోట్ల డాలర్లను యుద్ధమునకుసిద్ధపడుటకై అమెరికా సంయుక్తరాష్ట్రమువారు ఖర్చుపెట్టుటకై రూజ్వెల్టుఅధ్యక్షులుగారు జూలై౧వతేదినాడు అనుమతిని ఇచ్చియున్నారు, ఒకడాలరుసుమారు ౩౦ రూపాయిల విలువకలది.

ఉస్మాన్సాగరములో నీరు

ఉస్మాన్సాగరములో నీరుతక్కువైనందున హైదరాబాదు నగరంలోని కొన్నిప్రాంతంలో ముఖ్యంగాఆలియాబాదు, జహానుమా, జంగంపేట, చెన్నరాయునిగుట్ట. మైసరం, ఫలక్నుమా, ఉప్పుగూడా, యాఖుత్పురా, సైదాబాదు, పురానాహవేలీ, నవాబ్సాహెబ్కుంట, గడ్డిఅన్నారం, చెంచలగూడా, మలకపేట, రహీంబజారు, ఆది తరాలకు హిమాయతుసాగరమునుండి నీరుఇచ్చు ఏర్పాటు చేయబడియుండెను. దానినివడపోయుటలేదుకాని దానిలోక్లోరమిన్ మందునుకలుపుతున్నారు అందుచేత్రాగుటకు యోగ్యంగానున్నవి. కొన్నిప్రాంతాలనుండినీరు విశుద్ధంగాలేదని ఫిర్యాదులువచ్చినవి. కానినీటిలోలోపంలేదు. ప్రతిదినీటిని డాక్టర్లతో ప్రభుత్వంవారు పరీక్షింపచేయుచున్నారు. నీరుబాగాఉన్నది. ఎట్లయినను ప్రజలునీటిని వడబోసుకొని కాచిత్రాగుట మరీమంచిది-

## యూక్రేను యుద్ధమంటే హిందుస్థాన యుద్ధమే

హిందుస్థాన్ జాతీయసంఘము అనుదానికి కార్యదర్శిఆయిన షాలీన్‌సీల్ అనె ఇంగ్లీషువారులండనులో జూలై౧నాడు మాట్లాడుచు ఇట్లన్నాడు.

"హిందుస్థాన చరిత్రలో ఒకముఖ్య ఘట్టము సంభవించుచున్నది. రష్యాకుచేరి రష్యాదక్షిణభాగంలోఉండే యూక్రేనులో రష్యాజర్మనీవారలకు యుద్ధంజరుగుతూఉంది. అదిహిందుస్థానకొరకేజరుగుతుందని అనుకోవలెను. ఎన్నడోరష్యాలో హిందుస్థానముపై దండెత్తివస్తే వచ్చే ఆవేశభావనపోవలెను. ఆప్రమాదంఇప్పుడే సంభవించుచున్నది. హిందుస్థానసాయకులకు ఇష్టమున్నాలేకపోయినా ఈఎదుర్కొనుచున్న ఆపాయము వారుగమనింపవలసియున్నది. ఇంగ్లాండులోఉండే హిందుస్థానీలు ఇంగ్లీషువారికిని హిందూదేశమునకు సమానమైనఆపాయాన్ని కాంగ్రెసువారు ముస్లింలీగువారు గమనించి ఏకమై తొలగించవలెను, అట్లాయియుండిన రెండుదేశాలకు ఐక్యతబాగా కలిగియుండేది."

హిందూదేశపు
యువకులారా
మీరు
డబ్బు
సంపాదించుచు
పనినేర్చుకొనండి

## నేర్పరులైన పనివారగుటకు ఇదియేమీకు మంచి తరుణము!

● గవర్నమెంటువారికి చాలమంది టెక్నీషియనులు కావలసియున్నారు. వారిలో మీరొకరుగా యుండవచ్చును. గవర్నమెంటు టెక్నికల్ ట్రెయినింగు స్కీముననుసరించి ఒక సంవత్సరము మించకుండా మీకు తీవ్రమైన ట్రెయినింగు ఇచ్చెదరు ఈట్రెయినింగు ఇచ్చు కాలములో మీకు నెలకు 20 రూ॥ నుండి 25 రూ॥ ల వరకు ఇచ్చెదరు. ఈట్రయినింగు అయినపిమ్మట ఒక వర్తకపరీక్షనివ్వవలెను. ఆపరీక్షలో మీరు ప్యాసయినపిమ్మట టెక్నికల్ పరిశ్రమ శాఖలు అనగా డిఫెన్సు సర్వీసులు, ఆర్డినాన్సు, మందుగుండు సామానులు తయారుచేయు ఫ్యాక్టరీలు లేక సివిల్ ఇండస్ట్రీస్ మొదలగువాటియందు ఏదో ఒకదానిలో పనిచేయుటకు అర్హులగుదురు.

హిందూదేశపు పరిశ్రమల భవిష్యత్‌కు తోడ్పడుడు

మీరు ప్రత్యేకమైన టెక్నికల్ జ్ఞానము పొందుటవలనమీసొంతమునకు లాభించుటయేగాక, మీ మాతృదేశమునకు మీరు మిక్కిలిగొప్ప సేవచేయుటయు, త్వరలో ఆయుప్రసన్నమైన శాంతిచేకూర్చి హిందూదేశపు పరిశ్రమాభివృద్ధికి తోడ్పడుటయు జరుగును

గవర్నమెంటు ఖర్చుపైన పనినినేర్చుకొనండి.

సాధారణముగా ఒకవృత్తిని నేర్చుకొనుటకు మీరు డబ్బుఖర్చుపెట్టవలెను. కాని ఈస్కీము క్రింద గవర్నమెంటువారు మీకు ఉచితముగాపనినినేర్పడమే గాకుండా పనినినేర్పు కాలములో నెలకు 20 రూ॥ నుండి 25రూ॥ల వరకు జీతముకూడాఇస్తారు. మీరుచేయవలసిన దేమనగామీపేరు, పైవిలాసమును ఒక పోస్టుకార్డుమీదవ్రాసి దానిని మీ చెంతనున్న నేషనల్ సర్వీసులేబరు ట్రిబ్యునల్ వారి చిరునామాకు పంపినయెడల మీకు పూర్తి వివరములుపంపబడును, (ఈసంస్థయొక్క ఆఫీసులు:-కలకత్తా, మదరాసు, బొంబాయి, నాగపూర్, పాట్నా, కాన్పూరు, షిల్లాంగు,లాహోరు,కరాచీలయందుగలవు)

తక్షణమే దరఖాస్తు పెట్టుకొనండి!

పంచోలి ఆర్టు పిక్చరువారి

# ఖజానిచ

మూడవ వారము

ఈ చిత్రము విడుదల అయినప్పటినుండి ప్రతిఆటకు ఇప్పటివరకును ప్రజలకు స్థలముదొరకకుండానున్నది. త్వరపడుడు

# నిషాత్‌సినిమా

(పూర్వపు సెంట్రలు)

## కత్తితో పొడిచినట్లు బాధ

చురుకుగాపోట్లు పొడిచినట్లుండే బాధలు, రాత్రులయందుయు మీకు నిద్రపట్టనీయకుండా చేసి పనిచేయుట కళకళ్లలసుగాచేయును. అవియన్నియు కొంచెము లిటిల్సు ఓరియంటలు బాంరుద్దిన వెంటనేమాయమగును'

తలనొప్పి, వీపులోనొప్పి, బెనిపోటు, పంటినొప్పి మరియు ఇతరకండరముల నొప్పులు ఈమందుయొక్క గుణము చేతగ్గిపోవును. ఇదిఅసమానమైనది- ఒకసారిఉపయోగించినచో ఎల్లప్పుడు అదే వాడెదరు-

ORIENTAL BALM For Aches and Pains

లిటిల్సు

ఓరియంటల్ బాం

Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn. Editor- S. Prathapa Reddy B. A.B.L